| ఆంగ్ల తేది | మాసతిథివారః | నక్షత్రము | ఘ.విఘ | స్త్రీ.పు.న | లగ్నము | జలరాశులు | వాహనము |
|---|---|---|---|---|---|---|---|
| 16-12-21 | మార్గశిర శుక్ల ౧౩ గురు | మూల | ౧౪.౨ | నపు.పు | కుంభం | అర్ధజల | మండూకము |
| 29-12-21 | మార్గశిర కృష్ణ ౧౦/౧౧ బుధ | పూర్వాషాఢ | ౧౬.౧౨ | స్త్రీ.స్త్రీ | మీనం | పూర్ణజల | మయూరము |
| 11-01-22 | పుష్య శుక్ల ౯ మంగళ | ఉత్తరాషాఢ | ౧౭.౪౮ | స్త్రీ.పు | మేషం | పాదజల | అశ్వము |
| 24-01-22 | పుష్య కృష్ణ ౭ సోమ | శ్రవణ | ౨౦.౫౯ | పు.స్త్రీ | మిధునం | నిర్జల | జంబుకము |
| 06-02-22 | మాఘ శుక్ల ౫/౬ ఆది | ధనిష్ఠ | ౨౧.౨౮ | స్త్రీ.స్త్రీ | మిధునం | నిర్జల | మయూరము |
| 19-02-22 | మాఘ కృష్ణ ౩ శని | శతతార | ౩౬.౧౧ | నపు.పు | కన్య | నిర్జల | అశ్వము |
| 04-03-22 | ఫాల్గున శుక్ల ౨/౩ శుక్ర | పూర్వాభాద్ర | ౫౦.౪౬ | పు.పు | ధనుస్సు | అర్ధజల | జంబుకము |
| 18-03-22 | ఫాల్గున శుక్ల ౧౫ శుక్ర | ఉత్తరాభాద్ర | ౧౧.౨౩ | పు.స్త్రీ | వృషభం | అర్ధజల | మయూరము |
| 31-03-22 | ఫాల్గున కృష్ణ ౧౪/౩౦ గురు | రేవతి | ౩౮.౧౩ | స్త్రీ.పు | వృశ్చికం | పాదజల | గజము |

శ్లో ॥ స్త్రీ స్త్రీ వ్యసనం కుర్యాత్ స్త్రీ పుంసోర్వృష్టిరుచ్యతే। స్త్రీ నపుంసకయోర్వాయుః పురుషః పురుషశ్చ దాహకః ॥
ఆఖుశ్చ స్వల్ప వృష్టిశ్చ జంబుకే జలదాగమః। మండూకేఽత్యంత వృష్టిశ్చ ఖర మాహిష నిర్జలః ॥
అజశ్చ నిర్జలః ప్రోక్తః గజాశ్వశ్చ సుభిక్షకృత్। మయూరశ్చ మహావాయురిత్యేతద్వర్ష లక్షణమ్ ॥
ఋక్షం భాను ప్రవేశఘటికా యాస్తద్దినం వారభం యుక్తం పంచదశేన షష్ఠగుణితం నాగాప్తశేషం తథా।
వృష్టిశ్చాప్యతివృష్టి వహ్ని పవనాః వృష్టిశ్చ వృష్ట్యాగమః వృష్టిర్నాశముపైతి వృష్టి ఫలదం హ్యేవం విచింత్యేద్బుధః ॥

**తాత్పర్యము:** స్త్రీ స్త్రీ నక్షత్రములయిన వ్యసనం కలిగించును. స్త్రీ పురుష నక్షత్రములయిన వర్షము. స్త్రీ నపుంసకములయిన వాయువు. పురుష పురుష నక్షత్రములయిన ఎండ. ఆఖువు (ఎలుక) స్వల్పవర్షం. మయూరం (నెమలి) మహావాయువు. జంబుకం (నక్క) మేఘావృతం, మండూకం (కప్ప) మిక్కిలివర్షం. ఖర (గార్ధభ – గాడిద), మహిషం (దున్నపోతు) జల రహితం. అజ (మేష– మేక) నిర్జలం. గజ (ఏనుగు) అశ్వం(గుఱ్ఱం) సుభిక్షం. కార్తె ప్రవేశకాల ఘటికలలో తత్కాల తిథి, వార, నక్షత్ర సంఖ్యలను కలిపి అందు 15 కలిపి 6 చే గుణించి 8చే భాగించగా శేషము 1,2,5,6,8 అయిన వర్షము, 3 అయిన ఎండ, 4 అయిన వాయువు. 7 అయిన వర్ష నాశనము.

# వర్షయోగవిచారః

**చైత్రము :** ఈ మాసమున రవి, బుధ, శుక్రులు వాయు మహావాయు నాడుల యందు సంచరించుదురు. కుజుడు దహన సౌమ్య నాడుల యందు సంచరించును. కనుక గ్రీష్మాధిక్యము, వాతాధిక్యము కలుగును. పూర్వార్ధమున కుజుని స్వనాడీ సంచారము వర్ష ప్రతిబంధకము. ఉత్తరార్ధమున బుధ శుక్ర సమీప స్థితి మరియు శుక్రోదయము వలన తప్పక కొన్ని తావుల వర్షించును.

**వైశాఖము :** ఈ మాసమున రవి మహావాయు వాయు నాడుల యందు సంచరించును. బుధ, శుక్రులు వాయు దహన నాడుల యందు సంచరించుదురు. మాసాంతమునకు శుక్రుడు సౌమ్యనాడి యందు సంచరించును. కుజుడు రస, జల నాడుల యందు సంచరించును. మొత్తం మీద గ్రీష్మాధిక్యము, వాతాధిక్యముగనే యుండును. మధ్యప్రాంతమున బుధ, శుక్ర సమీప స్థితిచే కొన్ని తావుల వడగండ్ల వాన, ఉత్తరార్ధమున కుజచలనము వలన గాలితో కూడిన వాన కలుగును.

**జ్యేష్ఠము :** ఈ మాసమున రవి ప్రారంభమున దహననాడి యందు సంచరించుచు క్రమముగా సౌమ్య రసనాడులయందు సంచరించును. బుధుడు వాయు, దహన నాడుల యందు సంచరించును. శుక్రుడు రస, జల, అమృత నాడుల యందు, కుజుడు జల, అమృత నాడుల యందు సంచరించుటచే బీజవాపానుకూలముగ వర్షించును. పూర్వార్ధమున శుక్రుని స్వనాడీ సంచారముచే తప్పక వర్షించును.

**ఆషాఢము :** ఈ మాసమున రవి, రస జల అమృత నాడుల యందు సంచరించును. కుజుడు అమృతనాడి యందు సంచరించుటచే సస్యానుకూల వాతావరణముండ గలదు. శుక్రుడు, జల అమృత నాడుల యందు సంచరించును. బుధుడు, సౌమ్య రస జల అమృత నాడుల యందు సంచరించుటచే సస్యానుకూల వృష్టి యుండును. పూర్వార్ధమున కుజచలనము, మధ్యప్రాంతమున బుధస్థితి, ఉత్తరార్ధమున బుధుని స్వనాడీ సంచారము వలన మాసమంతయూ వర్షించును.

**శ్రావణము :** ఈ మాసమున రవి, బుధులు, జల అమృత నాడుల యందు సంచరించుదురు. శుక్రుడు, రస సౌమ్య దహన నాడుల యందు సంచరించును. కుజుడు, జల రసనాడుల యందు సంచరించును. పూర్వార్ధమున శుక్రుని స్వనాడీ సంచారము, మధ్యప్రాంతమున బుధుని స్వనాడీ సంచారము, మాసాంతమున కుజచలనము వలన తప్పక వర్షించును.

**భాద్రపదము :** ఈ మాసమున రవి, జల రస సౌమ్యనాడుల యందు కుజుడు రస సౌమ్య నాడుల యందు, బుధుడు, సౌమ్య దహన నాడుల యందు, శుక్రుడు, వాయు మహావాయు నాడుల యందు సంచరించును. ఉత్తరార్ధమున వర్షమునకవకాశము కలదు.

**ఆశ్వయుజము :** ఈ మాసమున రవి కుజులు, దహన వాయు నాడుల యందు సంచరించెదరు. పూర్వార్ధమున, కుజుని స్వనాడీ సంచారము, ఉత్తరార్ధమున రవి స్వనాడీ సంచారము వర్ష ప్రతిబంధకము. బుధుడు, సౌమ్య దహన నాడుల యందు, శుక్రుడు, మహావాయు వాయు దహన నాడుల యందు సంచరించుటచే వర్షమునకు అవకాశము తక్కువ. మాసమధ్య ప్రాంతమున కుజచలనము వలన కొన్నితావుల వర్షించును.

**కార్తికము :** ఈ మాసమున రవి, మహావాయు నాడియందు సంచరించును. కుజ,బుధులు, వాయు మహావాయు నాడుల యందు సంచరించుదురు. శుక్రుడు, దహన సౌమ్య వాయు నాడుల యందు సంచరించును. ఉత్తరార్ధమున వర్షమునకు అవకాశము కలదు.

| లగ్నము | ప్రమాణము | పుష్కరము | లగ్నము | ప్రమాణము | పుష్కరము |
|---|---|---|---|---|---|
| మేషం | ౪.౨ | ౨.౪౯ | తుల | ౫.౧౪ | ౪.౧౧ |
| వృషభం | ౪.౩౦ | ౨.౬ | వృశ్చికం | ౫.౨౮ | ౧.౧౬ |
| మిధునం | ౫.౧౧ | ౪.౯ | ధనుస్సు | ౫.౩౫ | ౩.౫౪ |
| కర్కటకం | ౫.౩౫ | ౧.౧౮ | మకరం | ౫.౧౧ | ౨.౨౫ |
| సింహం | ౫.౨౮ | ౩.౪౬ | కుంభం | ౪.౩౦ | ౩.౩౬ |
| కన్య | ౫.౧౪ | ౨.౫౬ | మీనం | ౪.౨ | ౦.౫౬ |



శ్రీ శృఙ్గేరీ శారదామ్బాయై నమః



# ఋణ విమోచన శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము

శ్లో॥ దేవకార్యార్థ సిద్ధ్యర్థం సభాస్తంభ సముద్భవమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౧

శ్లో॥ లక్ష్మ్యాలింగిత వామాఙ్గం భక్తానాం వరదాయకమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౨

శ్లో॥ అంత్రమాలాధరం శంఖచక్రాద్యాయుధ ధారిణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౩

శ్లో॥ స్మరణాత్సర్వపాపఘ్నం కద్రూజవిషనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౪

శ్లో॥ సింహనాదేన మహతా దిగ్దంతి భయనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౫

శ్లో॥ ప్రహ్లాదవరదం శ్రీశం దైత్యేశ్వర విదారణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౬

శ్లో॥ క్రూరగ్రహైః పీడితానాం భక్తానామభయప్రదమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౭

శ్లో॥ వేదవేదాంత యజ్ఞేశం బ్రహ్మరుద్రాది వందితమ్।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥ ౮

శ్లో॥ య ఇదం పఠతే నిత్యం ఋణమోచన సంజ్ఞితమ్ ।
అనృణీ జాయతే సద్యః ధనం శీఘ్రమవాప్నుయాత్ ॥ ౯

సద్భక్తిభావముతో నియమబద్ధముగా దీనిని పఠించువారలకు శ్రీలక్ష్మీనృసింహ కటాక్షమున ఋణవిమోచన మార్గము లభించును.

# గోచారములు

## మేషరాశి

### అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదము
### (చూ,చే, చో, ల, లీ, లూ, లే, లో, అ)
### ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 4, అవమానం : 3

వీరికి ఈ సంవత్సరమంతయు దశమశని కావున ఉద్యోగవిఘ్నము, పాపకార్యాసక్తి, వ్యవసాయమందు నష్టము, వ్యాకులత, నష్టము కలుగును. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి ఏకాదశమందు గురువు కనుక పరిస్థితులు అనుకూలించును. సంతానవృద్ధి, నూతన కృషి లాభము, గౌరవము, యత్నకార్య సిద్ధి యగును. ఉత్సాహముగ నుండును. కీర్తివృద్ధి, బలము, తేజస్సు, సుఖము, విరోధి నాశనము, మంత్రసిద్ధి కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు దశమ గురువు అగుటచే, వృత్తి, ఉద్యోగ, వ్యాపారాదుల యందు చిక్కులు, ఆస్తి నష్టం, సంతతి పీడ, గౌరవ భంగం, వృథా ప్రయాణములు, స్వజన విరోధములు కలుగును. సంవత్సరమంతయూ ద్వితీయ రాహువు, అష్టమ కేతువు కావున వృథా వైరములు, వ్యయములు, అధిక ప్రయాస కలుగును. ఆశ్వయుజ బహుళం నుండి కుజుడు సప్తమాది దశమాంత రాశులలో సంచరించును కావున అనుకూలుడు కాదు. కావున జాగ్రత్త అవసరము.

**అశ్వినీ** నక్షత్రం వారికి, మాఘ, ఫాల్గునముల యందు నైధనతార యందు కేతువు సంచరించును. **భరణి** వారికి, వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు నైధనతార యందు కేతువు సంచరించును. **కృత్తిక** వారికి, వైశాఖ బహుళం వరకు నైధనతార యందు కేతువు సంచరించును. మరియు ఆశ్వయుజం నుండి జన్మ నక్షత్రమందు రాహువు సంచరించును. మరియు మాఘ బహుళం వరకు శనివేధ కలదు. కావున జాగ్రత్త అవసరము. ఆయా సమయముల యందు ఆయా గ్రహములకు శాంతి యొనర్చిన మేలు. సంవత్సరమంతయూ శని, రాహు, కేతువులకు, ఉత్తరార్ధమున కుజునకు శాంతి యొనర్చిన మేలు జరుగును. హనుమత్పూజా ప్రదక్షిణముల వలన దోషములు తొలగి మేలు జరుగును.

## వృషభ రాశి

### కృత్తిక 2,3,4పాదములు, రోహిణి, మృగశిర 1,2పాదములు
### (ఈ, ఊ, ఏ, ఓ, వా, వీ, వూ, వే, వో)
### ఆదాయం : 2, వ్యయం : 8 - రాజపూజ్యం : 7, అవమానం : 3

వీరికి ఈ సంవత్సరమంతయు భాగ్యశనియగుటచే శుభకార్యవిఘ్నము, పితృ లేదా సదృశ వ్యక్తికి తీరని కష్టము, మనోవ్యాకులత యుండును. కళత్ర పుత్ర మూలక వృథ, ఒకప్పుడు ధనలాభము, శుభము కలుగును. సంవత్సరారంభము

నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి దశమ గురువు కనుక వృత్తి, ఉద్యోగ, వ్యాపారాదుల యందు తరచుగ చిక్కులు, ఆస్తి నష్టం, సంతతి పీడ, గౌరవ భంగం కలుగవచ్చును. వృథా ప్రయాణములు, స్వజన విరోధములు కలుగవచ్చును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు భాగ్యగురువు అయినందున చాలా వరకు పరిస్థితులు అనుకూలించును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. శుభకార్యానుకూలత యుండును. సంవత్సరమంతయు జన్మరాహువు, సప్తమ కేతువు అగుటచే వృథా వైరములు, భార్యాపుత్రాది స్వజనుల వైరము, ఆరోగ్య లోపము, వృథా వ్యయము, కళత్రవర్గంలో పేచీలు ఏర్పడగలవు. మార్గశిర శుక్లం నుండి కుజుడు సప్తమాది నవమాంత రాశులలో సంచరించును కావున అనుకూలుడు కాదు. కనుక జాగ్రత్త అవసరము.

**కృత్తిక** వారికి, వైశాఖ బహుళం వరకు నైధనతార యందు కేతువు, మరియు ఆశ్వయుజం నుండి జన్మ నక్షత్రమందు రాహువు సంచరించుదురు. మరియు మాఘ బహుళం వరకు శనివేధ కలదు. **రోహిణి** వారికి, జన్మతార యందు భాద్రపదం వరకు రాహువు, మార్గశిర బహుళం వరకు శనియు సంచరించుదురు. **మృగశిర** వారికి మాఘ బహుళం నుండి జన్మతార యందు శని సంచరించును. కావున జాగ్రత్త అవసరము. మొత్తము మీద వీరు శని, రాహు, కేతువులకు, సంవత్సరము చివర కుజునకు శాంతి యొనర్చిన మేలు జరుగును. ఆదిత్యహృదయ పారాయణము సప్తశతి పారాయణము, హనుమత్పూజా ప్రదక్షిణముల వలన దోషములు తొలగి శాంతిని పొందెదరు.

## మిథున రాశి

### మృగశిర 3,4 పాదములు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదములు
### (కా, కి, కు, ఖం, జ, ఛ, కే, కో, హ)
### ఆదాయం : 5 వ్యయం : 5 - రాజపూజ్యం : 3, అవమానం : 6

వీరికి ఈ సంవత్సరమంతయూ అష్టమశని యగుటచే మిక్కిలి శ్రమకరమగు కాలము. ప్రయత్నించిననూ కార్యములు సానుకూలపడవు. ధనవ్యయమగును. ప్రమాదములు, అపనిందలు, గౌరవహాని కలుగును. అయితే సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి కార్తిక బహుళం నుండి భాగ్యగురువు కావున చాలా వరకు పరిస్థితులు అనుకూలించును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు అష్టమ గురువు అయినందున చోరాగ్ని రాజ బాధలు కలుగును. అపనిందలు, భయము, గౌరవహాని కలుగును. సంవత్సరమంతయూ ద్వాదశ రాహువు, షష్ఠ కేతువు అగుటచే పరిస్థితులు అనుకూలించును. కొంత లాభము, జయము, ప్రోత్సాహము, కలుగ గలవు. గో, భూలాభము కలుగును. గత సంవత్సరము కంటే మెరుగుగ నుండగలదు. సంవత్సర

ప్రారంభమున, మధ్య ప్రాంతమున, చివరలో కుజుడు అనుకూలుడు గానందున చాలా జాగ్రత్త అవసరము. సాహస కృత్యములు మానవలయును. బాగుగా ఆలోచించి గాని ఏ కార్యము తలపెట్టరాదు.

**మృగశిర** వారికి, మాఘ బహుళం నుండి జన్మతార యందు శని సంచరించును. **ఆర్ద్ర** వారికి, ఆశ్వయుజం నుండి నైధనతార యందు రాహువు సంచరించును. **పునర్వసు** వారికి, మాఘ బహుళం వరకు నైధనతార యందు శని మరియు భాద్రపదం వరకు నైధనతార యందు రాహువు, మాఘ శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించుదురు. కావున ఆయా సమయముల యందు ఆయా గ్రహములకు ప్రత్యేకముగా శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద శని, గురువులకు, మధ్య మధ్య కుజునకు శాంతి చేయవలయును. ప్రతి నెలా తమ జన్మ నక్షత్రము నాడు మరియు మాస శివరాత్రికి పరమేశ్వర ప్రీతిగ అభిషేకము, ప్రతి శనివారము హనుమత్పూజా ప్రదక్షిణములు చేయుట చాలా మంచిది.

## కర్కాటక రాశి

### పునర్వసు 4వ పాదము, పుష్యమి, ఆశ్లేష

### (హి, హు, హే, హో,డా, డీ, డూ, డే, డో )

### ఆదాయం : 14, వ్యయం : 2 - రాజపూజ్యం : 6, అవమానం : 6

వీరికి ఈ సంవత్సరమంతయు సప్తమశని యగుటచే అనుకూలము కాదు. కొన్ని ఇబ్బందులు వచ్చును. స్వజన విరోధము కలుగును. చోరాగ్ని బాధలు కలుగును. ఆరోగ్య లోపము, అకాల భోజనము కలుగును. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి కార్తిక బహుళం నుండి అష్టమ గురువు అగుటచే చోరాగ్ని రాజ బాధలు కలుగును. అపనిందలు, భయము, గౌరవ హాని కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు సప్తమ గురువు అగుటచే అంతయూ అనుకూలించును. శాంతి సౌఖ్యములు కలుగును. సమస్యలు పరిష్కరించబడును. రాజ దర్శనము, ఇష్టకార్యసిద్ధి కలుగును. సంవత్సరమంతయూ ఏకాదశ రాహువు, పంచమ కేతువు కావున లాభము, జయము, ప్రోత్సాహము, గౌరవ మర్యాదలు, సన్మానము, పుత్రవిరోధము కలుగును. మొదటి ఐదు మాసములు కుజుడు ద్వాదశ జన్మ ద్వితీయములందు సంచరించును కావున అనుకూలుడు కాదు. కనుక జాగ్రత్త అవసరము.

**పునర్వసు** వారికి, నైధనతార యందు భాద్రపదం వరకు రాహువు, మాఘ బహుళం వరకు శనియు, మరియు మాఘ శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించుదురు. **పుష్యమి** వారికి, మాఘ బహుళం నుండి నైధనతార యందు శని, వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు జన్మతారతార యందు కేతువు సంచరించుదురు. మరియు వైశాఖ బహుళం వరకు కేతువేధ కలదు.

**ఆశ్లేష** వారికి, మాఘ బహుళం నుండి శనివేధ కలదు. మరియు వైశాఖ బహుళం వరకు జన్మతార యందు కేతువు సంచరించును. మొత్తము మీద వీరు శని, గురు, కుజులకు శాంతియొనర్చిన మేలు. అశ్వత్థనారాయణ సేవ, గురుసేవ వలన దోషములు తొలగి సుఖము నొందగలరు.

## సింహ రాశి

### మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పాదము
### (మ, మి, ము, మె, మో, ట, టి, టు, టే )
### ఆదాయం : 2, వ్యయం : 14 - రాజపూజ్యం : 2, అవమానం : 2

వీరికి ఈ సంవత్సరమంతయు షష్ఠశని యగుటచే విశేషించి అనుకూలమయిన కాలము. తలచిన కార్యములు చాలావరకు నెరవేరును. శుభ కార్యానుకూలత యుండును. సుఖము, ధనధాన్యవృద్ధి, ఇష్ట బంధు సమాగమము కలుగును. గృహనిర్మాణమునకు ప్రయత్నములు కలసి వస్తాయి. సంవత్సర ప్రారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి సప్తమ గురువు అగుటచే అనుకూలమయిన కాలము. ఆరోగ్యము, రాజ దర్శనము, ఇష్టకార్య సిద్ధి కలుగును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు షష్ఠ గురువు అగుటచే శత్రుజ్ఞాతి బాధలు, వ్యాజ్యములు చోరరోగ బాధలు అధికముగ నుండగలవు. సంవత్సరమంతయూ, దశమ రాహువు, చతుర్థ కేతువు అగుటచే, శుభాశుభ మిశ్రమముగ నుండగలదు. చిత్త చాంచల్యము, వాతరోగములు, ప్రయాణాదుల యందు ఇబ్బందులు ఉండును. ఉద్యోగాదుల యందు కొంత ఇబ్బంది, కొంత శుభము కలిగి తలచిన కార్యములు నెరవేరును. జ్యేష్ఠ మాసము నుండి నాలుగన్నర నెలలు కుజుడు అనుకూలుడు కానందున ఆరోగ్యాది విషయముల యందు జాగ్రత్త అవసరము.

**మఘ** వారికి, మాఘ బహుళం వరకు శనివేధ కలదు. మాఘ బహుళం నుండి నైధనతార యందు కేతువు సంచరించును. **పూర్వఫల్గుని** వారికి, వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు నైధనతార యందు కేతువు సంచరించును. **ఉత్తరఫల్గుని** వారికి, ఆశ్వయుజం నుండి జన్మతార యందు రాహువు సంచరించును. మరియు వైశాఖ బహుళం వరకు నైధనతార యందు కేతువు సంచరించును. కావున ఆయా సమయముల యందు ఆయా గ్రహములకు శాంతి యొనర్చిన మేలు జరుగును. గురుసేవ, హనుమత్పూజా ప్రదక్షిణముల వలన ఇబ్బందులు తొలగి మేలు జరుగును.

## కన్యా రాశి

### ఉత్తరఫల్గుని 2, 3, 4 పాదములు, హస్త, చిత్ర 1, 2 పాదములు
### (టొ, పా, పి, పూ, ష, ణ, ఢ, పె, పో)
### ఆదాయం : 5, వ్యయం : 5 - రాజపూజ్యం : 5, అవమానం : 2

వీరికి ఈ సంవత్సరమంతయూ పంచమశని యగుటచే సంతానమునకు ఇబ్బందులు, మనస్తాపము, స్వజన విరోధము కలుగును. సర్వము వ్యతిరేకముగ తోచును. ఆస్తినష్టము, కళత్ర, బంధుమూలక వ్యథ, తరచుగనేదో ఒక సమస్య, మర్యాదా భంగకరమయిన విషయములందాసక్తి కలుగును. ప్రారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి షష్ఠ గురువు కూడా అయినందున శత్రుజ్ఞాతి బాధలు, వ్యాజ్యములు, చోరరోగ బాధలు అధికముగా నుండగలవు. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు పంచమ గురువు అగుటచే చాలా వరకు పరిస్థితులు అనుకూలముగ నుండును. పుత్రవృద్ధి, సుజన మిత్రత్వము, ప్రభు అనుకూలత యుండును. సంవత్సరమంతయూ, తృతీయ కేతువు, భాగ్యరాహువు కావున పశునష్టము, ధనధాన్య నష్టము, మర్యాదాహాని కలుగును. కొంత లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. స్వల్ప అవరోధములున్ననూ, పరిస్థితులు అనుకూలముగనే యుండును. ఆషాఢాది మాస పంచకము కుజుని అనుకూలత లేదు కావున జాగ్రత్త అవసరము. ఆరోగ్య విషయమున జాగ్రత్తగా ఉండవలయును.

**ఉత్తరఫల్గుని** వారికి, ఆశ్వయుజం నుండి జన్మతార యందు రాహువు మరియు వైశాఖ బహుళం వరకు కేతువు సంచరించుదురు. **హస్త** వారికి, మాఘ బహుళం వరకు జన్మతార యందు శని సంచరించును. భాద్రపద బహుళం వరకు జన్మతార యందు రాహువు సంచరించును. **చిత్ర** వారికి, మాఘ బహుళం నుండి జన్మతార యందు శని సంచారము కలదు. మొత్తము మీద వీరు ఈ సంవత్సరము అంతయూ శనికి, ప్రారంభమున, అంతమున గురువునకు, మధ్య ప్రాంతమున కుజునకు శాంతి యొనర్చిన మేలు. గురుసేవ, హనుమత్పూజా ప్రదక్షిణములు శ్రేయోదాయకములు.

## తులా రాశి

### చిత్ర 3,4 పాదములు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదములు
### (రా, రి, రూ, రే, రో, త, తీ, తూ, తే)
### ఆదాయం : 2, వ్యయం : 8 - రాజపూజ్యం : 1, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు అర్ధాష్టమ శని యగుటచే శ్రమకరమగు కాలము. అనేక సమస్యలు వచ్చును. జాగ్రత్త అవసరము. కళత్ర పీడ, ఆస్తినష్టము,

శారీరక, మానసిక శ్రమ, స్వస్థాన హాని, వాతబాధలు కలుగును. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి పంచమ గురువు అగుటచే చాలావరకు అనుకూలముగ నుండును. పుత్రవృద్ధి, సుజన మిత్రత్వము, ప్రభు అనుకూలత యుండును. భాద్రపద బహుళం నుండి, కార్తిక శుక్లం వరకు చతుర్థ గురువు అయినందున బుద్ధి చాంచల్యము, తేజోహాని, ప్రవాసము, బంధుమూలక వ్యథ కలుగును. సంవత్సరమంతయూ ద్వితీయ కేతువు, అష్టమ రాహువు అయినందున అకారణ కలహములు, అపనిందలు, చతుష్పాజ్జంతువుల వలన పీడ కలుగును. భాద్రపదాది నాలుగు మాసములు కుజుడు అనుకూలుడు కానందున మిక్కిలి శ్రమకరముగ నుండును. సాహసకృత్యములు మానవలయును. బాగుగ ఆలోచించి కాని ఏ కార్యము తలపెట్టరాదు.

**చిత్ర** వారికి, మాఘ బహుళం నుండి జన్మతార యందు శని సంచరించును. **స్వాతి** వారికి, ఆశ్వయుజం నుండి నైధనతార యందు రాహువు సంచరించును. **విశాఖ** వారికి, మాఘ బహుళం వరకు నైధనతార యందు శని సంచారము మరియు మాఘ బహుళం నుండి శనివేధ కలదు. భాద్రపదం వరకు నైధనతార యందు రాహువు, మాఘ శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించుదురు. మరియు ఆశ్వయుజం నుండి రాహువేధ కూడా కలదు. కావున జాగ్రత్త అవసరము. మొత్తము మీద ఈ రాశి వారు శని, రాహు, కేతు, కుజులకు విశేష శాంతి యొనర్చిన మేలు. ప్రతి మాసము తమ జన్మ నక్షత్రము నాడు, మాస శివరాత్రికి, కార్తిక మాసమందు ప్రతి సోమవారము, ఏకాదశి నాడు పరమేశ్వర ప్రీతిగ అభిషేకమొనర్చిన, హనుమత్పూజా ప్రదక్షిణములు చేసిన అర్ధాష్టమ శని దోషముతో పాటు, సర్వగ్రహ దోషములు తొలగి అనుకూలముగ నుండును.

## వృశ్చిక రాశి

### విశాఖ 4వపాదం, అనూరాధ, జ్యేష్ఠ

### (తొ, నా, నీ, నూ, నే, నో, యా, యీ, యూ)

### ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 4, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు తృతీయశని అనుకూలుడు యగుటచే చాలావరకు అనుకూలమయిన కాలము. ఋణవిముక్తి, భూ,గృహ సంపాదన కలుగును. ఉద్యోగ ప్రాప్తి కలుగును. స్వబుద్ధితో ప్రయత్నించిన కార్యములు సిద్ధించును. భ్రాతృవర్గముతో గల వ్యాజ్యములు, పేచీలు పరిష్కరించబడును. గురువు తృతీయ, చతుర్థ రాశులలో సంచరించును కావున అనుకూలుడు కాదు. కొన్ని కార్యములు నెరవేరిననూ, ఉద్యోగ భంగము, మిత్ర వియోగము, కార్య భంగము, బంధు వియోగము, తేజోహాని, స్వస్థాన త్యాగము, ఒకప్పుడు కలుగును. సంవత్సరమంతయూ జన్మకేతువు, సప్తమ రాహువు అయినందున, వృథా వ్యయములు, వృథా వైరములు

కలుగును. తరచుగ ఇబ్బందులు వచ్చును. ఆరోగ్య లోపములు కలుగవచ్చును. కళత్రవర్గంలో పేచీలు ఏర్పడును. ప్రారంభమున రెండు మాసములు, ఆశ్వయుజ ఉత్తరార్థం నుండి మాఘమాసం వరకు కుజుడు అనుకూలుడు గాదు. కావున కొంత జాగ్రత్త అవసరము.

**విశాఖ** వారికి, మాఘ బహుళం వరకు నైధనతార యందు శని సంచారము మరియు మాఘ బహుళం నుండి శనివేధ కలదు. భాద్రపదం వరకు నైధనతార యందు రాహువు, మాఘ శుక్లం నుండి జన్మ నక్షత్రమందు కేతువు సంచరించుదురు. మరియు ఆశ్వయుజం నుండి రాహువేధ కూడా కలదు. **అనూరాధ** వారికి, మాఘ బహుళం నుండి నైధనతార యందు శని, మరియు వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు జన్మనక్షత్రమందు కేతువు సంచరించుదురు. **జ్యేష్ఠ** వారికి, వైశాఖ బహుళం వరకు జన్మనక్షత్రమందు కేతువు సంచరించును. కావున జాగ్రత్త అవసరము. మొత్తము మీద వీరు గురు, రాహు, కేతువులకు కుజునకు శాంతి యొనర్చిన మేలు. సప్తశతీ పారాయణము, ఆదిత్యహృదయ పారాయణముతో పాటు హనుమత్పూజా ప్రదక్షిణములు ఆచరించుట వలన మేలు జరుగును.

## ధనూరాశి

### మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపాదము

### (యే, యొ, బా, బి, బూ, ధ, భ, ఢ, బె)

### ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 7, అవమానం : 5

వీరికి ఈ సంవత్సరమంతయు, ద్వితీయశని యగుటచే ధనవ్యయము, తేజోహాని, అకారణ కలహములు కలుగును. ఎల్లప్పుడు కష్టము, కార్యనాశనము, స్వజన విరోధము, పాపచింతన కలుగును. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి తృతీయ గురువు అగుటచే శ్రమ అధికము, ఉద్యోగ భంగము, జగడములు కలుగును. బంధు విరోధము ఒకప్పుడు కలుగును. భాద్రపద బహుళం నుండి, కార్తిక శుక్లం వరకు ద్వితీయమున గురువు అనుకూలించును. ధన సంపాదన, సుఖము, కీర్తి ప్రతిష్ఠలు, మాట గౌరవము పొందుట జరుగును. సంవత్సరమంతయూ షష్ఠ రాహువు, వ్యయ కేతువు అగుటచే సకల కార్యములయందు జయము, ధైర్యము కలుగును. శత్రుజయమగును. గో,భూ లాభము కలుగును. ఆదాయమునకు మించిన వ్యయమగుట వలన కొన్ని సమస్యలు వచ్చును. అందుచే కార్యముల యందు విఘ్నములు కలుగును. మొత్తము మీద ఇబ్బంది లేదు. కుజుడు సప్తమాది ద్వితీయాంత రాశులలో సంచరించును కావున, సంవత్సరారంభమున, సంవత్సరాంతమున కొన్ని చిక్కు సమస్యలు, ఇబ్బందులు ఎదుర్కొనవలసి యుండును.

**మూలా నక్షత్రము** వారికి, మాఘ శుక్లం నుండి నైధనతార యందు కేతువు సంచరించును. **పూర్వాషాఢ** వారికి, వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు నైధనతార యందు కేతువు సంచరించును. **ఉత్తరాషాఢ** వారికి, ఆశ్వయుజం నుండి జన్మతార యందు రాహువు, మరియు వైశాఖ బహుళం వరకు నైధనతార యందు కేతువు సంచరించుదురు. కావున ఆయా సమయముల యందు జాగ్రత్త అవసరము. మొత్తము మీద వీరు సంవత్సరమంతయూ శనికి, సంవత్సరారంభమున, అంతమున గురు, కుజులకు శాంతి యొనర్చిన మేలు. గురుసేవ, సుందరకాండ పారాయణము వలన దోషములు తొలగును.

## మకర రాశి

### ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు, శ్రవణ, ధనిష్ఠ 1, 2 పాదములు
### (బో, జా, జీ, జూ, జే, జో, ఖ, గ, గీ)
### ఆదాయం : 14, వ్యయం : 14 - రాజపూజ్యం : 3, అవమానం : 1

వీరికి ఈ సంవత్సరమంతయు జన్మరాశిలో శని కావున మిక్కిలి శ్రమకరమగు కాలము. ఏ కార్యము సానుకూలము కాదు. వృథా కార్యములందు అలసట, భార్యాపుత్రాది స్వజన విరోధము, ఆరోగ్య లోపములు బాధించును. తేజోహాని, మతిభ్రంశము, భయము కలుగును. జనన సమయమున శని బలముగ యున్న అంతగా బాధ కలుగదు. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి ద్వితీయ గురువు అయినందున ధన సంపాదన, సుఖము, కీర్తి ప్రతిష్ఠలు, మాట గౌరవము పొందుట జరుగును. ధర్మకార్యముల యందు ధనవ్యయము కలిగిననూ ఆత్మసంతృప్తి కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు జన్మరాశిలో గురువు అగుటచే శుభమూలక ధనవ్యయం, రాజాగ్రహమునకు గురి అగుట, కీర్తి హాని, స్థానచలనం, శత్రుత్వం, అధిక వ్యయమగును. సంవత్సరమంతయూ, పంచమ రాహువు, లాభ కేతువు కనుక కొంత లాభము, జయము, ప్రోత్సాహము, సన్మానము జరుగును. పశులాభము కలుగును. పుత్రమూలక వ్యధ కలుగును. ప్రారంభమున రెండు మాసములు కుజుడు అనుకూలుడుగనుండిననూ పిమ్మట కొంత జాగ్రత్త అవసరము.

**ఉత్తరాషాఢ** వారికి, వైశాఖ బహుళం వరకు నైధనతార యందు కేతువు మరియు ఆశ్వయుజం నుండి జన్మతార యందు రాహువు సంచరించుదురు. **శ్రవణ** వారికి, మాఘ బహుళం వరకు జన్మనక్షత్రమందు శని, మరియు భాద్రపద బహుళం వరకు జన్మతార యందు రాహువు సంచరించుదురు. మరియు ఆశ్వయుజం నుండి రాహువేధ కలదు. **ధనిష్ఠ** వారికి, మాఘ బహుళం నుండి జన్మనక్షత్రమందు శని సంచారము, మరియు మాఘ శుక్లం నుండి కేతువేధ కలదు. కావున జాగ్రత్త

అవసరము. కనుక ఈ రాశి వారు ముఖ్యముగా శనికి, ఆయా కాలములందు గురు, కుజులకు శాంతి యొనర్చుట మేలు కలిగించును. గురుసేవ, సుందరకాండ పారాయణము, ఆదిత్య హృదయ పారాయణము చేయుట వలన, ప్రతి మాసమున తమ జన్మ నక్షత్రము రోజున అభిషేకము చేయించుట వలన దోషములు తొలగును.

## కుంభ రాశి

### ధనిష్ఠ 3, 4 పాదములు, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3 పాదములు
### (గు, గె, గో, స, సి, సు, సె, సొ, దా)
### ఆదాయం : 14, వ్యయం : 14 - రాజపూజ్యం : 6, అవమానం : 1

వీరికి ఈ సంవత్సరమంతయూ ద్వాదశ శనియగుటచే జాగ్రత్త అవసరము. ఆరోగ్యలోపములు, బంధువైరములు, గృహచ్ఛిద్రములు బాధించును. వృథా వ్యయములు కలుగును. వ్యవసాయమందు నష్టమెక్కువ. మానసిక అశాంతి అధికముగ నుండును. వృథా వాదనలకు చోటివ్వరాదు. గురువు సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు జన్మరాశిలో, అటు పిమ్మట కార్తిక శుక్లం వరకు వ్యయరాశిలో, అటు పిమ్మట తిరిగి జన్మరాశిలో సంచరించును కావున ధనవ్యయము, స్థాన చలనము కలుగును. పరిస్థితులు శ్రమకరముగ నుండగలవు. శుభమూలక ధనవ్యయము, రాజాగ్రహమునకు గురియగుట, కీర్తిహాని కలుగును. ఆస్తి సంబంధ విచారములు, వ్యాజ్యములు కలుగును. సంవత్సరమంతయూ చతుర్థ రాహువు, దశమ కేతువు కావున వృత్తి, ఉద్యోగ వ్యాపారాదుల యందు చిక్కులు, ఆస్తి నష్టం, గృహమందు అశాంతి కలుగును. మాతృవర్గ బంధు జనులతో వైరములు, చిత్త చాంచల్యం, ప్రయాణాదుల యందు విఘ్నములు, వాతరోగములు కలుగును. మధ్య మధ్య సుఖము, ఇష్ట భోజనము, శరీరదార్ఢ్యము కలుగును. జ్యేష్ఠ, ఆషాఢ, పుష్య, మాఘ మాసములందు పరిస్థితులు అనుకూలించును. భాద్రపద, ఆశ్వయుజములందు జాగ్రత్త అవసరము.

**ధనిష్ఠ** వారికి, మాఘ శుక్లం నుండి కేతువేధ కలదు. మరియు మాఘ బహుళం నుండి జన్మ నక్షత్రమందు శని సంచారము కలదు. **శతతార** వారికి, ఆశ్వయుజం నుండి నైధనతార యందు రాహువు సంచరించును. **పూర్వాభాద్ర** వారికి, మాఘ బహుళం వరకు నైధనతార యందు శని, భాద్రపద బహుళం వరకు నైధనతార యందు రాహువు కూడా సంచరించుదురు. మాఘ శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించును. కావున జాగ్రత్త అవసరము. మొత్తం మీద వీరు నవగ్రహ శాంతి యొనర్చిన మేలు. గురుసేవ, హనుమత్పూజా ప్రదక్షిణములు, సుందరకాండ పారాయణము, సప్తశతీ పారాయణమొనర్చుట ద్వారా శ్రేయస్సునొందగలరు.

# మీన రాశి

## పూర్వాభాద్ర 4వపాదము, ఉత్తరాభాద్ర, రేవతి
## (ది, దు, శం, ఝ, థ, దె, దొ, చ, చి)
## ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 2, అవమానం : 4

వీరికి ఈ సంవత్సరమంతయూ ఏకాదశమందు శని అనుకూలుడు. సర్వము అనుకూలించును. సకల కార్యముల యందు లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. ఆరోగ్యము, ద్రవ్యలాభము, భార్యాపుత్రాది స్వజన లాభము కలుగును. సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి కార్తిక బహుళం నుండి ద్వాదశ గురువు అగుటచే అపనిందలు, ధనవ్యయము కలుగును. భాద్రపద బహుళం నుండి కార్తిక శుక్లం వరకు ఏకాదశ గురువు అగుటచే విశేషించి అనుకూలమయిన కాలము. చాలా వరకు చిక్కులు తొలగును. పరిస్థితులు అనుకూలించును. కీర్తివృద్ధి, బలము, తేజస్సు, ఎల్లచోట్లా జయము, సుఖము, విరోధి నాశనము, మంత్రసిద్ధి కలుగును. సంవత్సరమంతయూ తృతీయ రాహువు, భాగ్యకేతువు అగుటచే తలచిన కార్యములు నెరవేరును. భ్రాతృద్వేషము, మర్యాదాహాని, పాడిపంటలకు ఇబ్బంది ఒకప్పుడు కలుగును. ప్రారంభమున రెండు మాసములు అర్ధాష్టమ కుజుడు కావున ప్రయాణాదుల యందు జాగ్రత్త అవసరము. భాద్రపదాది ఆరు మాసములు కుజుడు సప్తమాది దశమాంత రాశులలో సంచరించును. కావున సాహస కృత్యములు మానవలయును.

**పూర్వాభాద్ర** వారికి, మాఘ బహుళం వరకు నైధనతార యందు శని, భాద్రపద బహుళం వరకు నైధనతార యందు రాహువు సంచరించును. మాఘ శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించును. **ఉత్తరాభాద్ర** వారికి, మాఘ బహుళం నుండి నైధనతార యందు శని సంచరించును. వైశాఖ బహుళం నుండి మాఘ శుక్లం వరకు జన్మతార యందు కేతువు సంచరించును. **రేవతి** వారికి, వైశాఖ బహుళం వరకు జన్మతార యందు కేతువు సంచరించును. కావున జాగ్రత్త అవసరము. గురు, కుజులకు శాంతి యొనర్చిన మేలు. గురుసేవ, హనుమత్పూజా ప్రదక్షిణములు శ్రేయోదాయకములు.

## సూచన

జాతక గ్రహస్థితి, దశాంతర్దశలు, వామ పార్శ్వ సుముఖ వేధలు మరియు అష్టకవర్గ న్యూనాధిక బిందుఫలములు మొదలగు ఇతర కారణములచే స్థూలంగా సూచించబడిన ఈ ఫలితములు ఈషద్వైషమ్యముగా మాత్రమే ఫలించును. నవగ్రహ బలాబలములచే ఇందు కొంత మార్పు కలుగును.

# సుముహూర్తములు

ఈ సంవత్సరము ఉత్తమ ముహూర్తములు నిర్దుష్టములగునవి అతి స్వల్పము. ఉన్నంతలో మెరుగైనవి సూచించబడినవి. విజ్ఞులు నీర క్షీర న్యాయమున గ్రహించ ప్రార్థితులు.

## చైత్ర మాసము

05-05-21 చైత్ర కృష్ణ ౯/౧౦ బుధవారం శతతారాయుక్త మీనం ౫౪.౧౦ రా॥3.21 (౧౨ చంద్రః) వివాహం.

## వైశాఖ మాసము

13-05-21 వైశాఖ శుక్ల ౨ గురువారం రోహిణీయుక్త కుంభం ౫౧.౧౭ రా॥2.10 (మార్తాండ రహితం) వివాహం, మీనం ౫౩.౭ రా॥2.54 వివాహం.

19-05-21 వైశాఖ శుక్ల ౭/౮ బుధవారం మఘాయుక్త మీనం ౫౨.౧౭ రా॥2.32 (౬ చంద్రః) వివాహం.

21-05-21 వైశాఖ శుక్ల ౯/౧౦ శుక్రవారం ఉత్తరఫల్గునీయుక్త మీనం ౫౨.౦౦ రా॥2.25 (౭ చంద్రః) వివాహం (మార్తాండ రహితం).

22-05-21 వైశాఖ శుక్ల ౧౧ శనివారం హస్తయుక్త మీనం ౫౧.౫౧ రా॥2.21ని॥ వివాహం (౭ చంద్రః).

23-05-21 వైశాఖ శుక్ల ౧౨/౧౩ ఆదివారం చిత్రాయుక్త కుంభం ౪౯.౫౨ రా॥1.33ని॥ వివాహం.

26-05-21 వైశాఖ శుక్ల ౧౫/కృష్ణ ౧ బుధవారం అనూరాధాయుక్త కుంభం ౪౯.౨౮ రా॥1.22ని॥ వివాహం. మీనం ౫౧.౧౮ రా॥2.06 వివాహం.

27-05-21 వైశాఖ కృష్ణ ౧/౨ గురువారం మూలాయుక్త మేషం ౫౭.౪ రా॥4.25ని॥ వివాహం.

29-05-21 వైశాఖ కృష్ణ ౩/౪ శనివారం ఉత్తరాషాఢాయుక్త కుంభం ౪౯.౨ రా॥1.12ని॥ వివాహం.

30-05-21 వైశాఖ కృష్ణ ౪/౫ ఆదివారం శ్రవణయుక్త మేషం ౪౬.౩౯ రా॥4.15ని॥ వివాహం.

02-06-21 వైశాఖ కృష్ణ ౮ బుధవారం శతతారాయుక్త మిధునం ౬.౫ ఉ॥8.01ని॥ వివాహం, గృహారంభం.

03-06-21 వైశాఖ కృష్ణ ౯ గురువారం ఉత్తరాభాద్రాయుక్త కుంభం ౪౮.౨౮ రా॥12.58ని॥ వివాహం. మేషం ౫౬.౧౩ రా॥4.4ని॥ వివాహం.

04-06-21 వైశాఖ కృష్ణ ౧౦ శుక్రవారం రేవతీయుక్త కుంభం ౪౮.౧౯ రా॥12.54ని॥ వివాహం. మేషం ౫౬.౪ రా॥4.00ని॥ వివాహం.

## జ్యేష్ఠ మాసము

17-06-21 జ్యేష్ఠ శుక్ల ౭/౮ గురువారం ఉత్తరఫల్గునీయుక్త కుంభం ౪౬.౨౫ రా॥12.10 వివాహము (౭ చంద్రః).

18-06-21 జ్యేష్ఠ శుక్ల ౮ శుక్రవారం ఉత్తరఫల్గునీయుక్త సింహం ౧౪.౫ ఉ॥ 11.14 వివాహం (మార్తాండ రహితం).

19-06-21 జ్యేష్ఠ శుక్ల ౯ శనివారం హస్తయుక్త సింహం ౧౩.౫౫ ఉ॥ 11.10 వివాహాదులు.

20-06-21 జ్యేష్ఠ శుక్ల ౧౦ ఆదివారం చిత్రాయుక్త సింహం ౧౩.౪౫ ఉ॥ 11.06 వివాహం, ఉపనయనం.

21-06-21 జ్యేష్ఠ శుక్ల ౧౧/౧౨ సోమవారం స్వాతీయుక్త సింహం ౧౩.౩౫ ఉ॥ 11.03 ఉపనయనాదులు.

24-06-21 జ్యేష్ఠ శుక్ల ౧౫/కృష్ణ౧ గురువారం మూలాయుక్త మేషం ౫౨.౫౧ రా॥ 2.45 వివాహాదులు.

26-06-21 జ్యేష్ఠ కృష్ణ ౨/౩ శనివారం ఉత్తరాషాఢాయుక్త మీనం ౪౬.౩౭ రా॥ 12.16 వివాహం. ఉత్తరాషాఢాయుక్త మేషం ౫౨.౩౨ రా॥ 2.39ని॥ వివాహం.

27-06-21 జ్యేష్ఠ కృష్ణ ౩/౪ ఆదివారం శ్రవణయుక్త మీనం ౪౬.౨౭ రా॥ 12.12 వివాహం.

02-07-21 జ్యేష్ఠ కృష్ణ ౮/౯ శుక్రవారం రేవతీయుక్త మేషం ౫౧.౩౩ రా॥ 2.17 వివాహం.

03-07-21 జ్యేష్ఠ కృష్ణ ౯/౧౦ శనివారం అశ్వినీయుక్త మీనం ౪౫.౩౭ రా॥ 11.55 వివాహం.

04-07-21 జ్యేష్ఠ కృష్ణ ౧౦ ఆదివారం అశ్వినీయుక్త సింహం ౧౧.౨౮ ఉ॥ 10.15 వివాహ, ఉపనయనాదులు.

## శ్రావణ మాసము

11-08-21 శ్రావణ శుక్ల ౩/౪ బుధవారం ఉత్తరఫల్గునీయుక్త మిధునం ౫౪.౩౧ రా॥ 3.39 వివాహం.

12-08-21 శ్రావణ శుక్ల ౪/౫ గురువారం హస్తయుక్త మిధునం ౫౪.౨౦ రా॥ 3.35 వివాహం (మార్తాండ రహితం).

14-08-21 శ్రావణ శుక్ల ౬ శనివారం స్వాతీయుక్త కన్య ౮.౩౦ ఉ॥ 9.16 వివాహాదులు. గృహారంభం. ౭ స్వాతీయుక్త మిధునం ౫౩.౫౭ రా॥ 3.27 వివాహం.

18-08-21 శ్రావణ శుక్ల ౧౧ బుధవారం మూలాయుక్త కన్య ౭.౪౮ ఉ॥ 9.00 వివాహం. గృహారంభం (మార్తాండ రహితం).

20-08-21 శ్రావణ శుక్ల ౧౩/౧౪ శుక్రవారం ఉత్తరాషాఢాయుక్త మీనం ౩౬.౧౩ రా॥ 8.22ని॥ వివాహాదులు, (మార్తాండ రహితం).

21-08-21 శ్రావణ శుక్ల ౧౪ శనివారం శ్రవణయుక్త తుల ౧౪.౧౫ ఉ॥ 11.35ని॥ వివాహం, గృహారంభం.

22-08-21 శ్రావణ శుక్ల ౧౫/కృష్ణ ౧ ఆదివారం శతతారాయుక్త మిధునం ౫౨.౩౪ రా॥ 2.55ని॥ వివాహం, (మార్తాండ రహితం).

23-08-21 శ్రావణ కృష్ణ ౧ సోమవారం శతతారాయుక్త కన్య ౬.౫౪ ఉ॥ 8.38ని॥ గృహారంభాదులు. తుల ౧౩.౫౩ ఉ॥ 11.26.

26-08-21 శ్రావణ కృష్ణ ౪ గురువారం రేవతీయుక్త కన్య ౬.౨౨ ఉ॥ 8.27ని॥ వివాహం గృహారంభం. ౫ అశ్వినీయుక్త మిథునం ౫౧.౫౧ రా॥ 2.38ని॥ వివాహం.

01-09-21 శ్రావణ కృష్ణ ౧౦ బుధవారం మృగశిరాయుక్త కన్య ౫.౨౧ ఉ॥ 8.03ని॥ వివాహం, గృహారంభం.

## ఆశ్వయుజ మాసము

23-10-21 ఆశ్వయుజ కృష్ణ ౩/౪ శనివారం రోహిణీయుక్త కన్య ౫౬.౧౮ రా॥ 4.33

24-10-21 ఆశ్వయుజ శుక్ల ౪/౫ ఆదివారం మృగశిరాయుక్త సింహం ౫౨.౦౦ రా॥ 2.50ని॥ వివాహం.

30-10-21 ఆశ్వయుజ కృష్ణ ౯/౧౦ శనివారం మఘాయుక్త ధనుస్సు ౧౨.౨౯ ప॥ 11.05ని॥ వివాహం, కన్య ౫౫.౫ రా॥ 4.07ని॥ (౧౨ చంద్రః) వివాహం.

## కార్తిక మాసము

06-11-21 కార్తిక శుక్ల ౨/౩ శనివారం అనూరాధాయుక్త సింహం ౪౯.౪౨ రా॥ 2.02 వివాహం.

07-11-21 కార్తిక శుక్ల ౩/౪ ఆదివారం మూలాయుక్త కన్య ౫౩.౪౧ రా॥ 3.35 వివాహం.

10-11-21 కార్తిక శుక్ల ౬ బుధవారం ఉత్తరాషాఢాయుక్త ధనుస్సు ౧౦.౩౩ ఉ॥ 10.22 (మార్తాండ రహితం) వివాహం, గృహారంభం, గృహప్రవేశం.

13-11-21 కార్తిక శుక్ల ౯/౧౦ శనివారం శతతారాయుక్త ధనుస్సు ౧౦.౨ ఉ॥ 10.10ని॥ వివాహం, గృహారంభం, గృహప్రవేశం.

14-11-21 కార్తిక శుక్ల ౧౦/౧౧ ఆదివారం ఉత్తరాభాద్రాయుక్త మిథునం ౩౭.౫౭ రా॥ 9.23 వివాహాదులు. కన్య ౫౨.౨౮ రా॥ 3.11 (౭చంద్రః) (మార్తాండ రహితం) వివాహం, గృహప్రవేశం.

15-11-21 కార్తిక శుక్ల ౧౧/౧౨ సోమవారం ఉత్తరాభాద్రాయుక్త ధనుస్సు ౯.౪౧ ఉ॥ 10.02 గృహారంభాదులు (రాజ).

20-11-21 కార్తిక కృష్ణ ౧ శనివారం రోహిణీయుక్త ధనుస్సు ౮.౩౨ ఉ॥ 9.39 (౬ చంద్రః) వివాహం, గృహారంభం.
౨ సింహం ౪౭.౧౪ రా॥ 1.08ని॥ వివాహం.

21-11-21 కార్తిక కృష్ణ ౨ ఆదివారం మృగశిరాయుక్త ధనుస్సు ౮.౨౧ ఉ॥ 9.35ని॥ (౬చంద్రః) ౩ సింహం ౪౭.౩ రా॥ 1.04 వివాహం.

26-11-21 కార్తిక కృష్ణ ౭ శుక్రవారం మఘాయుక్త మిథునం ౩౫.౩౦ రా॥ 8.29 వివాహం.

27-11-21 కార్తిక కృష్ణ ౮ శనివారం మఘాయుక్త ధనుస్సు ౭.౧౪ ఉ॥ 9.13ని॥ వివాహం.

28-11-21 కార్తిక కృష్ణ ౯ ఆదివారం ఉత్తరఫల్గునీయుక్త మిథునం ౩౫.౮ రా॥ 8.22ని॥ వివాహం.

29-11-21 కార్తిక కృష్ణ ౧౦ సోమవారం ఉత్తరఫల్గునీయుక్త ధనుస్సు ౬.౫౨ ఉ॥ 9.04ని॥ గృహారంభం.

## మార్గశిర మాసము

09-12-21 మార్గశిర శుక్ల ౬/౭ గురువారం ధనిష్ఠాయుక్త కన్య ౪౭.౫౧ రా॥1.34ని॥ (౬చంద్రః). శతతారాయుక్త తుల ౫౪.౫౧ రా॥4.22ని॥ వివాహం.

10-12-21 మార్గశిర శుక్ల ౭ శుక్రవారం శతతారాయుక్త మిధునం ౩౩.౯ రా॥7.42ని॥ (మార్తాండ రహితం) వివాహం.

12-12-21 మార్గశిర శుక్ల ౯ ఆదివారం ఉత్తరాభాద్రాయుక్త ధనుస్సు ౪.౪౨ ఉ॥8.20ని॥ వివాహం. ఉత్తరాభాద్రాయుక్త మిధునం ౩౨.౪౭ రా॥7.33ని॥ వివాహాదులు.

13-12-21 మార్గశిర శుక్ల ౧౦ సోమవారం రేవతీయుక్త ధనుస్సు ౪.౩౧ ఉ॥8.16ని॥ గృహారంభము.

17-12-21 మార్గశిర శుక్ల ౧౪ శుక్రవారం రోహిణీయుక్త కన్య ౪౬.౨౧ రా॥1.01 వివాహం.

18-12-21 మార్గశిర శుక్ల ౧౫ శనివారం మృగశిరాయుక్త సింహం ౪౨.౨ రా॥11.18ని॥ వివాహాదులు.

19-12-21 మార్గశిర శుక్ల ౧౫/కృష్ణ ౧ ఆదివారం మృగశిరాయుక్త మిధునం ౧౩.౫౦ ప॥12.02 వివాహాదులు.

24-12-21 మార్గశిర కృష్ణ ౫ శుక్రవారం మఘాయుక్త కుంభం ౧౨.౫౩ ప॥11.42ని॥ వివాహం.

25-12-21 మార్గశిర కృష్ణ ౬/౭ శనివారం ఉత్తరఫల్గునీయుక్త తుల ౫౨.౨౮ రా॥3.33ని॥ వివాహం.

## మాఘ మాసము

02-02-22 మాఘ శుక్ల ౧/౨ బుధవారం శతతారాయుక్త కన్య ౩౭.౪౦ రా॥9.42ని॥ (౬చంద్రః) వివాహాదులు.

04-02-22 మాఘ శుక్ల ౩/౪ శుక్రవారం ఉత్తరాభాద్రాయుక్త కన్య ౩౭.౧౯ రా॥9.38ని॥ (౭చంద్రః) వివాహాదులు (మార్తాండ రహితం).

05-02-22 మాఘ శుక్ల ౪/౫ శనివారం రేవతీయుక్త కన్య ౩౭.౮ రా॥9.33ని॥ (౭చంద్రః) వివాహాదులు.

07-02-22 మాఘ శుక్ల ౬/౭ సోమవారం అశ్వినీయుక్త కుంభం ౪.౩౯ ఉ॥8.29ని॥. మీనం ౬.౨౯ ఉ॥9.13ని॥ వివాహం, గృహారంభం, (మార్తాండ రహితం).

10-02-22 మాఘ శుక్ల ౯ గురువారం రోహిణీయుక్త మీనం ౫.౫౭ ఉ॥9.00ని॥ వివాహం, గృహారంభం. ౧౦ రోహిణీయుక్త కన్య ౩౬.౧౫ రా॥9.07ని॥ వివాహాదులు.

11-02-22 మాఘ శుక్ల ౧౦ శుక్రవారం మృగశిరాయుక్త కుంభం ౩.౫౭ ఉ॥8.12ని॥ వివాహం, గృహారంభం, ఉపనయనం.

14-02-22 మాఘ శుక్ల ౧౩ సోమవారం పునర్వసుయుక్త మీనం ౫.౧౭ ఉ॥8.41ని॥ ఆవశ్యక గృహారంభాదులు.

## జనన ప్రకరణము

అశ్విని 1వ పాదం తండ్రికి - భరణి 4వ పాదం శిశువుకు - కృత్తిక 4వ పాదం తల్లికి - రోహిణి మేనమామకు, తండ్రికి - ఆర్ద్ర తల్లికి - పుష్యమి 2,3 పాదములు పగలు తండ్రికి, రాత్రి తల్లికి - ఆశ్లేష 2వ పాదం శిశువుకు, 3వ పాదం తల్లికి, 4వ పాదం తండ్రికి - మఘ 1,2 పాదములు తండ్రికి - పూర్వఫల్గుని 4వ పాదం తల్లికి - ఉత్తరఫల్గుని 1వ పాదం పగలు తండ్రికి, రాత్రి తల్లికి - హస్త 3వ పాదం పుత్రుడైన తండ్రికి, పుత్రికయైన తల్లికి - చిత్ర 1వ పాదం తల్లికి, 2వ పాదం తండ్రికి - విశాఖ 4వ పాదం తల్లికి - జ్యేష్ఠ 1వ పాదం తల్లికి, 2వ పాదం సోదరులకు, మేనమామలకు, 3వ పాదం శిశువులకు, 4వ పాదం తండ్రికి - మూల 1వ పాదం తండ్రికి, 2వ పాదం తల్లికి, 3,4 పాదములు ధనమునకు - పూర్వాషాఢ 3వ పాదం తండ్రికి - పూర్వాభాద్ర 4వ పాదం శిశువునకు - రేవతి 4వ పాదం తండ్రికి గండము కాన యథావిధిగా శాంతి జరుపవలెను. కృష్ణ చతుర్దశి, అమావాస్య, వర్జ్యము, గ్రహణ కాలములందు గాని, మాతాపితృ సోదరుల జన్మ నక్షత్రములందు జననమైనను, నాళ వేష్ట (ప్రేగు మెడలోవేసుకుని) జననమైనను వికృత జననమైనను ఆయా విశేషశాంతులను జరుపుకొనవలెను.

## జన్మనక్షత్రమును బట్టి గ్రహదశలెఱుంగుట

| | | |
|---|---|---|
| కృత్తిక, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ | రవిదశ | 6 సంవత్సరములు |
| రోహిణి, హస్త, శ్రవణ | చంద్రదశ | 10 సంవత్సరములు |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | కుజదశ | 7 సంవత్సరములు |
| ఆర్ద్ర, స్వాతి, శతతార | రాహుదశ | 18 సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | గురుదశ | 16 సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర | శనిదశ | 19 సంవత్సరములు |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | బుధదశ | 17 సంవత్సరములు |
| మఘ, మూల, అశ్విని | కేతుదశ | 7 సంవత్సరములు |
| పూర్వఫల్గుని, పూర్వాషాఢ, భరణి | శుక్రదశ | 20 సంవత్సరములు |

## జన్మరాశి, నామరాశి వల్ల చేయు కార్యములు

గృహము, వాస్తుకర్మ, వ్యవహారము, మంత్రము, యంత్రము, దానము, చుట్టరికము, రాజసేవ, భూబలము, వర్గ శుద్ధి, యుద్ధము, యాత్రాదులకు నామ నక్షత్రము చూడవలయును. తక్కిన వివాహాది శుభకార్యములకును, శరీరమును గురించిన శుభాశుభములకు జన్మ నక్షత్రమును చూడవలయును. నలుబది సంవత్సరములకు పైన జన్మనక్షత్రము చూడగూడదను వాడుకయున్నది. ఇది శాస్త్రమునకు విరుద్ధము. జన్మముండు వరకు జన్మనక్షత్రము చూడవలయును.

## నామ నక్షత్రములను తెలుసుకొను విధము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చు | చె | చో | ల | అశ్విని | రూ | రె | రో | త | స్వాతి |
| లీ | లూ | లె | లో | భరణి | తి | తు | తె | తో | విశాఖ |
| అ | ఈ | ఉ | ఏ | కృత్తిక | నా | నీ | నూ | నె | అనూరాధ |
| ఓ | వా | వీ | వూ | రోహిణి | నో | యా | యి | యు | జ్యేష్ఠ |
| వే | వో | కా | కి | మృగశిర | యె | యో | బా | బీ | మూల |
| కూ | ఖ | జ్ఞ | ఝు | ఆర్ద్ర | బూ | ధా | బా | ఢా | పూర్వాషాఢ |
| కె | కో | హా | హీ | పునర్వసు | బె | బో | జా | జీ | ఉత్తరాషాఢ |
| హూ | హె | హో | డ | పుష్యమి | జు | జే | జో | ఖా | అభిజిత్ |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష | ఖి | ఖు | ఖె | ఖో | శ్రవణ |
| మా | మీ | మూ | మె | మఘ | గా | గీ | గు | గే | ధనిష్ఠ |
| మో | టా | టీ | టు | పూ.ఫ | గో | సా | సీ | సు | శతతార |
| టె | టో | పా | పీ | ఉత్తర | సే | సో | దా | ది | పూర్వాభాద్ర |
| పూ | ష | ణ | ఢ | హస్త | దు | శం | ఛా | థా | ఉత్తరాభాద్ర |
| పె | పో | రా | రి | చిత్ర | దె | దో | చా | చీ | రేవతి |

## మేషాది జన్మరాశులకు ఘాతతిథ్యాదులను దెలుపు చక్రము

| రాశి | తిథి | వారము | నక్షత్రము | చంద్రుడు |
|---|---|---|---|---|
| మేషం | ౬ | ఆది | మఘ | జన్మ |
| వృషభం | ౪ | శని | హస్త | పంచమ |
| మిథునం | ౮ | సోమ | స్వాతి | సప్తమ |
| కర్కటకం | ౯ | బుధ | అనూరాధ | ద్వితీయ |
| సింహం | ౯ | శని | మూల | షష్ఠ |
| కన్య | ౮ | శని | శ్రవణ | దశమ |
| తుల | ౧౨ | గురు | శతతార | తృతీయ |
| వృశ్చికం | ౧౦ | శుక్ర | రేవతి | సప్తమ |
| ధనుస్సు | ౨ | శుక్ర | భరణి | ద్వితీయ |
| మకరం | ౧౨ | కుజ | రోహిణి | అష్టమ |
| కుంభం | ౪ | గురు | ఆర్ద్ర | ఏకాదశ |
| మీనం | ౨ | శుక్ర | ఆశ్లేష | ద్వాదశ |

## తిథ్యంత గండములు

అమావాస్య ప్రతిపత్తులయొక్కయు, దశమ్యేకాదశుల యొక్కయు, పూర్ణిమా ప్రతిపత్తులయొక్కయు సంధియందు రెండు ఘడియలు శిశుగండము.

## గండ పురుషస్థితి

చైత్ర - భాద్రపద - ఆశ్వయుజ - కార్తిక మాసములయందు పాతాళంబునను, వైశాఖ - శ్రావణ - మాఘ - ఫాల్గున మాసములందు స్వర్గలోకంబునను, జ్యేష్ఠ - ఆషాఢ - మార్గశీర్ష - పౌష్య మాసములందు భూలోకమున సంచరించును. భూలోకమున సంచరించునపుడు రజస్వల, ప్రసూతి మొదలగునవి సంభవించిన యెడల మరణము కలుగజేయును. తక్కిన రెండు ప్రదేశములయందు శుభము కలుగజేయును.

## రాశిగండములు

మీనమేషముల యొక్కయు, కర్కటక సింహముల యొక్కయు, వృశ్చిక ధనుస్సుల యొక్కయు సంధి యందు అర్ధఘటిక శిశు గండము. ఈ దుష్ట నక్షత్రాదికమునందు జననమైన శిశువుకు అష్టావాక్య జపమును, హోమమును, రుద్రాభిషేకమును, అశ్వత్థ ప్రదక్షిణములను, అన్నదానమును యథావిధిగాజేసిన యెడల ఆయా గండములకు శాంతియగును. తిథిగండమునకు వృషభమును, నక్షత్రగండమునకు గోవును, లగ్న గండమునకు కాంచనమును దానమియ్యవలెను.

విష ఘడియలలో మొదటి ఘడియయందు జననమయిన తండ్రికి, రెండవ ఘడియ తల్లికి, మూడవ ఘడియ ధనమునకు(ధనహాని), నాలుగవ ఘడియ శిశువునకు దోషము.

## జ్యేష్ఠా నక్షత్రమునందలి 10 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తల్లితల్లికి | 6వ భాగం | శిశువంశమునకు |
| 2వ భాగం | తల్లి తండ్రికి | 7వ భాగం | ఉభయవంశములకు |
| 3వ భాగం | మేనమామకు | 8వ భాగం | సోదరులకు |
| 4వ భాగం | శిశువుతల్లికి | 9వ భాగం | శ్వశురునకు |
| 5వ భాగం | శిశువునకు | 10వ భాగం | సర్వమునకు నష్టము. |

## మూలా నక్షత్రమునందలి 12 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తండ్రికి | 7వ భాగం | పినతల్లికి |
| 2వ భాగం | తల్లికి | 8వ భాగం | భార్యకు |
| 3వ భాగం | అన్నదమ్ములకు | 9వ భాగం | శిశువునకు |
| 4వ భాగం | అక్కచెల్లెళ్ళకు | 10వ భాగం | దారిద్ర్యం |
| 5వ భాగం | మామగారికి | 11వ భాగం | రాజ్యలాభం |
| 6వ భాగం | మేనత్తకు | 12వ భాగం | భాగ్యము కలుగును. |

## మాస ఫలము చూచు క్రమము

శుద్ధపాడ్యమి ప్రవేశమునందేనక్షత్రమగునో ఆనక్షత్రము లగాయతు తన నక్షత్రము వరకు లెక్కించి ఆ సంఖ్యను 9చే భాగించగా మిగిలిన శేషము 1 ప్రయాణము, 2 మృష్టాన్న భోజనము, 3 తనుతాపము, 4 శౌర్యము, 5 విద్య, 6వవస్త్రలాభము, 7 శోకము, 8 అనంత పుణ్యము, 9 మహాఫలము కలుగును.

## తారాబలము చూచు క్రమము

జన్మ నక్షత్రములగాయతు నిత్యనక్షత్రము వరకు లెక్కపెట్టి 9చే భాగించగా మిగిలిన భాగము 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6వసాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార అగుచున్నది.

ఈ తారలలో 2-4-6-8-9 తారలు మంచి ఫలమును, 1-3-5-7 తారలు దుష్టఫలమును యిచ్చును.

## చంద్రబలమును చూచు క్రమము

తన జన్మరాశి లగాయతు చంద్రుడున్న రాశివరకు గణన చేయగా 1-3-6-7-10-11 రాశులయందు చంద్రుడుండగా ధనలాభము, కార్యసిద్ధి, శుభమునిచ్చును. మిగతా రాశులయందు కార్యవిఘ్నము కలుగును. విశేషమేమనగా శుక్లపక్షమున 2,5,9 రాశులయందును, కృష్ణపక్షమున 4, 8, 12 రాశులయందును వుండగా తల్లి కుమారుని రక్షించినట్లు చంద్రుడు మనలను రక్షించును. శుక్ల పక్షమున చంద్రబలమున్ను, కృష్ణపక్షమున తారాబలమున్ను ముఖ్యముగా జూచుచుండవలయును.

## పురశ్శుక్ర దోషము

నూతన వధువు, గర్భిణీ స్త్రీ, శిశు సహిత యగు స్త్రీయును శుక్రుడు తూర్పు దిక్కుననున్నప్పుడు, పశ్చిమదిక్కునుండి వాయువ్య దిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పు దిక్కునకు ప్రయాణం చేయగూడదు. పశ్చిమదిక్కునందు శుక్రుడున్నప్పుడు తూర్పు దిక్కునుండి ఆగ్నేయమునకు, దక్షిణమునకు, నైఋతి దిక్కునకు పశ్చిమమునకు వెళ్ళగూడదు. ఈ పురశ్శుక్ర దోషము ఏకగ్రామమందు, దుర్భిక్షమందు, రాజవిద్వరము వచ్చినపుడు, వివాహమునకు, తీర్థయాత్రలకు వెళ్ళునపుడు దోషము కాదు. భారద్వాజాంగీరస భృగ్వత్రివత్స కాశ్యపవాసిష్ఠ గోత్రజుల వారిని ఈ పురశ్శుక్ర దోషమెప్పుడును బాధింపదు.

## పొయ్యి వేయుటకు

కృత్తిక, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, శతతార, రేవతి ఈ నక్షత్రములందును, ఆది, మంగళ, శనివారములందును ౩-౫-౧౦-౧౩-౧౫- తిథులయందును, వృషభ, మిధున, కన్యా, తులా, ధనుర్మీన లగ్నములందును శుభము.

## స్త్రీ ప్రథమ రజోదర్శన గుణదోషములు

**తిథులు:** పాడ్యమియందు మహాపాపినియును, విదియయందు పుత్రవతియును, తదియయందు సౌఖ్యవతియును, చవితియందు వృషలియును, పంచమియందు శుభప్రదురాలును, షష్ఠియందు వికృత సంచారిణియును, సప్తమియందు శుభ ప్రదురాలును, అష్టమియందు వికృత సంచారిణియును, నవమియందు విశేషకష్టియును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచికలదియును, ద్వాదశియందు పతిని దూషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమామావాస్యల యందు దుష్టచారిణియును అగును.

**నక్షత్రములు :** భరణి, ఆశ్లేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీ నక్షత్రముల 1 వ పాదం భర్తృనాశనమును, 2 వ పాదం పుత్రనాశనమును, 3 వ పాదం ధన నాశనమును, 4 వ పాదం అశుభమును కలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, మఘ, జ్యేష్ఠ యీ నక్షత్రముల యొక్క 1 వ పాదం మంగళము గలిగించును. 2 వ పాదమునైన 25గురికి భోజనము పెట్టవలయును. 3,4 పాదములందును, ఆది మంగళ శని వారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును దుష్టయోగములయందు రజస్వల అయినయెడల యథావిధిగా శాంతి చేయవలెను.

## బల్లి పాటునకు ఫలము

శిరస్సు - కలహము, ముఖము - బంధు దర్శనము, కనుబొమ్మల నడుమ - రాజానుగ్రహము, పై పెదవి - ధనవ్యయము, క్రింది పెదవి - ధనలాభము, ముక్కు చివర - కోపము, కుడిచెవి - దీర్ఘాయువు, ఎడమచెవి - వర్తకలాభము, నేత్రము - ఖైదు, గడ్డము - రాజదండనము, నోరు - భయము, కంఠము - శత్రు హాని, కుడి భుజము - స్త్రీ సంగమము, కుడి ముంజేయి - కీర్తి, ఎడమ మంజేయి - రోగము, స్తనయుగ్మము - దోషము, ఉదరము - ధాన్యలాభము, రొమ్ము, నాభి - ధనలాభము, ప్రక్కలు - సుఖము, పాదము - ప్రయాణము, వీపు - శుభము, గోళ్ళు - ధన వ్యయము, లింగము - దారిద్ర్యము, జుట్టుకొన - మృత్యువు,

ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫలమిట్లేనని తెలియవలయును.

## వాస్తు పురుష స్థితి

భాద్రపదాది 3 మాసములు తూర్పు శిరస్సుగాను, మార్గశీర్షాది 3 మాసములు దక్షిణ శిరస్సుగాను, ఫాల్గునాది 3 మాసములు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాది 3 మాసములు ఉత్తర శిరస్సుగాను, ఎడమ ప్రక్కగా వాస్తు పురుషుడు ఇంటి నిమిత్తము తీసుకొను స్థలమందు శయనించును. కావున అతని దృష్టి ప్రసరించిన దిక్కునను, పాదములందును గృహమును కట్టగూడదు.

## మృతికి దుష్ట నక్షత్రములు

భరణి, కృత్తిక, రోహిణి, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి - ఈ నక్షత్రములయందును, ఆది, మంగళ, శుక్రవారముల యందును, ౧-౨-౩-౬-౧౧-౧౨-౧౩-౧౪-౩౦ ఈ తిథుల యందును మృతి సంభవించిన గృహమునకు దోషము. కేవలం తిథివల్ల దోషం లేదు. తిథి వారముల వల్ల స్వల్పదోషము. తిథి నక్షత్రముల వల్ల అర్ధదోషము. తిథి వార నక్షత్రముల వల్ల సంపూర్ణదోషము గలుగును. మృగశిర, చిత్ర ఇవి ద్విపాద నక్షత్రములు. ఈ నక్షత్రములయందు మృతి సంభవించిన 3 మాసములున్ను, భరణి, రోహిణి, మఘ, ధనిష్ఠా పంచకములు వీటియందు 6 మాసములున్ను గృహమును వదలవలయును.

## ఆశౌచ ప్రకరణము

శిశువు ప్రాణములతో పుట్టి నాభిచ్ఛేదనకు పూర్వమందు మరణము నొందెనేని తల్లికి పది దినములు మృతాశౌచమున్నూ, తండ్రికి, సోదరులకు మూడు దినములు జాతాశౌచము, మృతాశౌచము స్నానమాత్రముననే శుద్ధి. మృతప్రసవమైనను, నాభిచ్ఛేదనమయిన తరువాత శిశువు మరణించినను తండ్రి సోదరులకు జ్ఞాతులకు సంపూర్ణ జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రం. తల్లికి దశరాత్ర మృతాశౌచము. పది దినముల లోపల శిశువు మరణించినయెడల జ్ఞాతులకు తల్లిదండ్రి, సోదరులకు, జాతాశౌచము. జననాది శేషముతో శుద్ధి. మృతాశౌచము స్నానమాత్రము. దంతజనన పర్యంతము జ్ఞాతులకు స్నానమాత్రము, చూడాకర్మ పర్యంతం ఒక దినము, ఉపనయన పర్యంతము, మూడుదినములు ఆశౌచము. వివాహమయిన స్త్రీ తండ్రియింట మరణించిన తల్లిదండ్రి, సోదరులు పెండ్లికాని పడుచులకు మూడుదినములు ఆశౌచము. పెండ్లియైన స్త్రీ తల్లిదండ్రుల మరణమునందు దశరాత్రములోగా త్రిరాత్రాశౌచము పట్టవలెను. సోదరీసోదరులకు సన్నిధానాసన్నిధానములయందు త్రిరాత్రాశౌచము. మాతామహుడు, మాతామహి, పినతల్లి పెత్తల్లులు, మేనమామ మేనత్త, దౌహిత్రుడు, పినతల్లి పెత్తల్లి బిడ్డలకు, మేనత్త మేనమామ బిడ్డలకు పురుష పర్యాయములో సన్నిధానమందు త్రిరాత్రము. గ్రామాంతరమునందు పక్షిణి. పక్షిణీ కాలాతి క్రమణమందు గ్రామాంతరమున వింటే ఆ పగలు, రాత్రివింటే ఆ రాత్రి ఉండి స్నానం. మేనమామ భార్యకు సన్నిధానంలో స్నానం. భార్య ఉండగా, సంతానం ఉండగా అత్తమామలు మరణించినయెడల సన్నిధానమందు మూడుదినములు, అసన్నిధానమందు పక్షిణి. భార్యసంతానము లేనియెడల సామీప్యమున ఒకరాత్రి అసన్నిధానమందు స్నానం.

